*E. S. Sastry Series No. 11.*



Sree



# PRASNOTTARA RATNAMALA,

BY

Eleswarapu Subrahmanya Sastry.







Publisher,

*P. Subbarow,*

Cocanada.



PRINTED BY

SCAPE & CO., COCANADA.

1913.

శ్రీ

# ప్రశ్నోత్తరరత్నమాల.

ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి
ఆంధ్రపద్యసహితము.

ఇది

పారుపూడి సుబ్బారావుచేఁ
బ్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000.

కాకినాడ:
స్కేప్ అండు కంపెనీయందు
ముద్రితము.

1913.

 [వెల రు 0-4-0.

# ప్రశ్నోత్తర రత్నమాల.



ఓంకార లక్ష్యసంలక్ష్యం
సచ్చిదానందరూపకం
నిర్వికల్పం గుణాతీతం
తత్త్వమేకం భజామ్యహం.

శ్లో. కః ఖలునాలంక్రియతే
సిద్ధాసిద్ధార్థసాధనపటీయాన్
అముయాకంఠస్థితయా
ప్రశ్నోత్తరరత్నమాలికయా.

గీ. ప్రాజ్ఞులలరఁ బ్రశ్నోత్తరరత్నమాల
కంఠమందున్న రెండుజగంబులందు
మహితశుభము సాధింపసమర్థుఁడగుటఁ
బ్రీతిఁదాన నెవ్వఁడలంకరింపఁబడఁడు ?

శ్లో. భగవన్ ! కిముపాదేయం? గురువచనం;
హేయమపిచకిం? మకార్యం;
కోగురుః? రధిగతతత్త్వశ్శిష్య
హితాయోద్యతస్సతతం;

గీ. గురుఁడ! సంపాద్య మెయ్యది? గురువుపల్కు;
హేయ మెయ్యది? దకార్యంబ • యెవఁడుగురువు?
సకలతత్త్వ విజ్ఞానియై • సంతతంబు
శిష్యహిత సంప్రయత్నంబు • సేయునతఁడు;

శ్లో. కింపథ్యతరం? ధర్మః; కశ్శుచి?
రిహయస్య మానసంశుద్ధం;
కః పణ్డితో? వివేకీ; కింవిష?
మవధీరణాగురుషు;

గీ. ఏదిపథ్యంబు? ధర్మంబ • యెవఁడు శుద్ధుఁ?
డిట్టిధర్మప్రవర్తనా • హీనహృత్త్వ
వితుఁ; డెవఁడు పండితుఁడు? వి • వేకి; విషస
మానమెయ్యది? గుర్వవ • మానచర్య;

శ్లో. త్వరితంకిం కర్తవ్యం విదుషా?
సంసారసంతతిచ్ఛేదః;
కిం మోక్షతరోర్బీజం?
సమ్యక్ జ్ఞానం క్రియాసిద్ధం;

గీ. ధరణి బుధులకు శీఘ్రక • ర్తవ్యవిషయ
మేది? సంసార సంతతి • చ్ఛేద; మేది
మోక్షవృక్షంబునకు బీజ • భూత? మధిక
సత్క్రియా సిద్ధదివ్య వి • జ్ఞానమొకటె.

శ్లో. సంసారేకింసారం? సుధియా
నిశ్చిత్యసారమిదమేవ;
మనుజేషుదృష్టతత్త్వః కః?
పరహిత ఉద్యతస్సతతం.

గీ. ఏది సంసారమునసార? మిద్ధబుద్ధి
నెంచిచూచిన దో సార♦మిదియసుమ్మి;
యెవఁడు మనుజులలోపల♦దృష్టతత్త్వుఁ?
డనయముఁ బరోపకార ప♦రాయణుండు.

శ్లో. మదిరేవమోహజనకః కః? స్నే
హః; కేచదస్యవో? విషయాః
కాభవవల్లీ? తృష్ణా; కో వై
రీ? యస్త్వనుద్యోగః;

గీ. మదిరయట్టుల మోహమె♦య్యదిఘటించు?
మైత్రి; దస్యులెవ్వారలి♦మ్మహివిషయము;
లేదిభవవల్లిక? దురాశ;♦యెవఁడు వైరి?
యప్రియత్నుఁడు సత్క్రియ♦లాచరింప;

శ్లో. కస్మాద్భయమిహ? మరణా; దన్ధా
దపికోవిశిష్యతే? రాగీ;
కశ్శూరో? యోలలనాలోచన
బాణైర్నవ్యథితః;

గీ. జగతి దేనివలన భయంబు? చావువలన;
గ్రుడ్డికంటెను నెవ్వఁ డంధుఁడగు? రాగి;
శూరుఁడెవఁడు? సతీదృక్ప్రసారతీక్ష్ణ
బాణచయముల నిరసంపడనివాఁడు;

శ్లో. పాతుం కర్ణాంజలిభిః కిమమృత
మివయుజ్యతే? సదుపదేశః;
కింగురుతాయామూలం?
యదేతదప్రార్థనంనామ.

గీ. చెవుల పేరిటి దోసిళ్ళ చేత నమృత
మట్లు త్రావఁగ నెయ్యది యర్హమగును?
సదుపదేశంబు; మూలమెయ్యదగు గౌర
వమ్మునకును? నయాచకత్వమ్ము తలఁప;

శ్లో. కింగహనం? స్త్రీచరితం; కశ్చతురో?
యోనఖండితస్తేన;
కిందారిద్ర్య? మసంతోషః; కింలాఘవ?
మధమహాయాచ్ఞా;

గీ. తెలియశక్యముకాదేది? స్త్రీచరిత్ర
చతురుఁ డెవఁ? డాచరిత్ర కసాధ్యుఁ డైన
వాఁడు; లేమియేది? యతృప్తి భావ; మేది
యగును లాఘవం? బారయ నధమయాచ్ఞ.

శ్లో. కింజీవిత? మనవద్యం;
కింజాడ్యం? పాఠ నేప్యనభ్యాసం;
కోజాగర్తి? వివేకీ;
కానిద్రా మూఢతాజన్తోః;

గీ. ఏదిజీవిత? మనవద్య;♦మేదిమౌర్ఖ్య?
మరయ నధ్యయనాధ్యాప♦నావివేక;
మెవఁడు జాగరూకుఁడు? జ్ఞాని;♦యేదినిద్ర
జంతువులకెల్ల? మూర్ఖతా♦సంభ్రమంబు.

శ్లో. నళినీదళగత జలవత్తరళంకిం?
యౌవనంధనంచాయుః;
కథయపునః కేశశినః
కిరణసమాః? సజ్జనాఏవ.

గీ. జలజపత్ర జలమునట్లు♦చలములేవి?
యౌవనంబు, ధనం, బాయువు♦ననెడిమూఁడు
మఱల నుడువుము జలజార♦తరుణకిరణ
సదృశులెవ్వరో? యొక్క-స♦జ్జనగణంబ;

శ్లో. కోనరకః? పరవశతా;
కింస్వర్గం? సర్వసంగవిరతిర్యా;
కిం సాధ్యం? భూతహితం; ప్రియమపి
కిం ప్రాణినా? మసవః;

గీ. ఏదినరకము? పరవశత్వ;♦మేదిస్వర్గ
మఖిలసంగ పరిత్యాగ;♦మరయసాధ్య
మేది? సకలభూతవిహిత;♦మేదిప్రియము
ప్రాణికోటి కెల్లను? ప్రాణ♦పంచకంబు.

శ్లో. కిందాన? మనాకాంక్షం;
కిమ్మిత్రం? యన్నివర్తయతిపాపాత్
కోzలంకార? శ్శీలం;
కింవాచాంమండనం? సత్యం;

గీ. ఏదిదాన? మనాకాంక్ష;♦మెవఁడుమిత్రుఁ?
డఘమునుండి మరల్చెడు♦నాతఁ; డేది
భూషణంబు? శీలంబు; వా♦గ్భూషణమనఁ
దనరునేది? యాడినమాటఁ♦దప్పకుంట.

శ్లో. కిమనర్థఫలం? మానః;
కాసుఖదా? సాధుజనమైత్రీ;
సర్వవ్యసనవినాశే
కోదక్షః? స్సర్వథాత్యాగీ;

గీ. మహిననర్థఫలంబేది?♦మాన; మేది
సౌఖ్యదంబు? సాధుజనప్ర♦శస్తమైత్రి
మనమునందెన్న సర్వవ్య♦సనవినాశ
దక్షుఁడెవ్వఁడు? సర్వథా♦త్యాగియొకఁడే;

శ్లో. కోZన్ధో? యోZకార్యరతః;
కోబధిరో? యశ్శృణో
తినహితాని; కోమూకో?
యఃకాలేప్రియాణివక్తుంనజానాతి;

గీ. అంధుఁడెవ్వఁ? డకార్యంబు♦లాచరించు
నతఁడు; బధిరుఁడో నెవ్వఁడు♦హితమువినని
యతఁడు;మూఁగయెవఁడు?సమ♦యంబునంబ్రి
యంబువల్క స్ఫురింపని♦యట్టివాఁడు.

శ్లో. కింమరణం? మూర్ఖత్వం; కించానర్ఘం?
యదవసరే దత్తం
ఆమరణాత్ కింశల్యం?
ప్రచ్ఛన్నం యత్కృతంపాపం;

గీ. భువిమరణమేది? మౌర్ఖ్య; మ♦మూల్యమేది?
యవసరంబైన యప్పుడి♦యఁబడునదియ;
చచ్చువఱకేది బాధించు♦శల్యమట్లు?
పరఁగప్రచ్ఛన్నకృతమైన♦పాపకృతియ.

శ్లో. కుత్రవిధేయోయత్నః?
విద్యాభ్యాసే, సదౌషధే, దానే;
అవధీరణాక్వకార్యా?
ఖల, పరయోషి, త్పరధనేషు;

గీ. యత్నమెచ్చోటఁ జేయనౌ?♦నౌషధంబుఁ
గొనునపుడు, విద్దియల నేర్చు♦కొనెడునపుడు
దానమిడునప్డు; నిరసనం♦బూనుటెందు?
పరధనపరాంగనాఖల♦ప్రతతియందు.

శ్లో. కాహర్నిశమనుచింత్యా?
సంసారాసారతా, నతుప్రమదా?
కాప్రేయసీవ? కరుణా,
కిందాక్షిణ్యఁ? మహన్మైత్రీ;

గీ. ఏదిస్మరణీయమారయ♦నెల్లవేళ?
భవమసారమనెడిపల్కు♦ప్రమదలఁదలఁ
పంగఁదగదెప్డు; ప్రేయసి♦వంటిదేది?
కరుణ; దాక్షిణ్యమననేమి? పరమమైత్రి.

శ్లో. కణ్ఠగతైరప్యసుభిః కస్య
హ్యాత్మానశక్యతేజేతుం?
మూర్ఖస్య శంకితస్య
విశదస్యతథాకృతఘ్నస్య.

గీ. తనదుప్రాణముల్ కంఠగ♦తంబులైన
నెట్టివానికి నాత్మఁజ♦యింపరాదు?
మూర్ఖునకు, నిత్యసంశయ♦బుద్ధికిం, గృ
తఘ్నునకు, నవిశదునకుఁ♦దలఁచిచూడ.

శ్లో. కః పూజ్యః? సద్వృత్తః, కమధమ
మాచక్షతే? చలితవృత్తం;
కేనజితం జగదేతత్?
సత్యతితీక్షావతాపుంసా.

గీ. ఎవఁడు పూజ్యుండు? సద్వృత్తుఁ;డెవనినీచుఁ
డందురి? చలితవర్తను;నవనియెవని
చే జయింపఁబడె? నిజంబుఁజెప్పనట్టి
వరతితీక్షాఢ్యుఁడై నట్టిపురుషుచేత.

శ్లో. కస్మైనమస్కురరపికిరియతేహిం?
దయావతాం పరిధానాయ
కస్మాదుద్విజితవ్యం?
సంసారారణ్యతస్సుధియాం;

గీ. ఎవ్వనికమరులును నమస్కృతులొనర్తు?
రలదయాఢ్యుల లోననాయకునికొఱకు;
ధీరుఁడెద్దానినుండియుఁద్వేగమంద
వలయు? నతిసాంద్ర సంసారవనమునుండి;.

శ్లో. కస్యవశేప్రాణిగణః?
సత్యప్రియభాషిణో వినీతస్య;
క్వస్థాతవ్యం?
న్యాయ్యేదృష్టాదృష్టార్థలాభాయ;

గీ. ప్రాణులెవ్వనివశములు? ప్రకటవినయ
మొప్పసత్యముఁ బ్రియముగాఁ జెప్పువాని;
కిహపరాతి సౌఖ్యమ్మున కెచటనుండ
వలయు? న్యాయసన్మార్గప్రవర్తనమున;

శ్లో. విద్యుద్విలసితమివకిం?
దుర్జనసంగస్త్రథాయువతయశ్చ;
కులశీల నిష్ప్రకంపాః
కే కలికాలేపి? సత్పురుషాః;

గీ. మెఱుపువలె నుండునేది? కాఁపురుషమైత్రి,
యూవతంబును; గలికాలమందు నేని
నిజకులాచార సద్ధర్మనిష్ప్రకంపు
లైనవారేరు? సత్పురుషాళికాదె;

శ్లో. చింతామణిరివదుర్లభమిహకిం?
కథయేచతుర్భద్రం
కింతద్వదన్తి భూయః
ప్రవిగతతమసో విశేషేణ.

శ్లో. దానం ప్రియవాక్సహితం జ్ఞాన
మగర్వం క్షమాన్వితంశౌర్యం
విత్తంత్యాగసమేతం
దుర్లభమేతచ్చతుర్భద్రం

గీ. ఇలను చింతామణియుఁబోలె♦నేదిదుర్ల
భంబొ చెప్పుమ? యదెచతు♦ర్భద్రమగును;
ప్రవిగతాజ్ఞానులౌ చతు♦ర్భద్రమనిన
నేవి శేషము నుడి వెద♦రెంచిచెప్పుమ.

గీ. అసమహిత వాక్ప్రహితమైన♦యట్టియీవి,
గర్వశూన్యవిజ్ఞానంబు,♦క్షమగలట్టి
శౌర్యమును,త్యాగసహితార్థ♦చయము నివియె
వరచతుర్భద్రములు దుర్ల♦భములుఁదలఁప.

శ్లో. కః కులకమలదినేశః ?
సతిగుణవిభవేఽపియోనమ్రః;
కింశోచ్యం? కార్పణ్యం;
సతివిభవేశస్త? మౌదార్యం;

గీ. కులకమల దినేశుఁడెవండు?♦గుణసమృద్ధి
విభవముండియు నమ్రుఁడై♦వెలయువాఁడు
ఏదిశోచ్యంబు? కార్పణ్య;♦మేవభాగ్య
మున్నశస్తము? నౌదార్య♦మొసఁగి యుంట;

శ్లో. పరధనహృదయహరాకా?
సమ్యక్కవితా, వివేకవత్తాచ;
కంనస్పృశతి విపత్తిః?
వృద్ధస్యవచోఽనువర్తనం, దాంతం;

గీ. పరధనమనంబుల హరించి♦వరఁగునేది?
ప్రథితకవిత, వివేక; మా♦పత్తులెవని
నంటకుండును? వృద్ధవా♦క్యాళిననుస
రించువానిని, దాంతుఁడై ♦మించువాని;

శ్లో. కస్సై స్పృహయతి కమలా?
విమలచరిత్రాయ, నీతివృత్తాయ;
త్యజతి చ కం సహసా?
ద్విజగురుదేవ వినిందకంచ, సాలస్యం;

గీ. కమల యెవ్వానిఁగోరును♦విమలచరితు
న్యాయమార్గానువర్తు; ర♦యంబ యెవని
విడుచు? గురువుల నమరుల♦ద్విజులనింద
లొగినొనర్చెడి జను నను♦ద్యోగిఁ దలఁప.

శ్లో. కుత్ర విధేయో వాసః?
సజ్జననికటేఽథవా కాశ్యాం
కః పరిహార్యో దేశః?
పిశునయుతో లుబ్ధభూపస్య;

గీ. జగతి నివసింపఁదగు నెంద? ♦సాధుజనస
మీపమునఁగాని వారణా♦శీపురాన;
విడువఁదగునేది? లుబ్ధభూ♦విభుని సంగ
తిం దగు పిశునజనము వ♦ర్తించు తావు.

శ్లో. కేనాశోచ్యః పురుషః
ప్రణతకళత్రేణ, ధీరవిభవేన;
ఇహభువనేకశ్శోచ్యః
సత్యపివిభవేనయోదాతా;

గీ. జనుఁడు దేనిచే శోచింప♦సాధ్యపడుఁడు?
ప్రణతభార్యచే, ధీరమై ♦భవనముచేత;
నవని శోచింపఁగాఁ దగు♦నాతఁడెవ్వఁ
డతివిభవముండిదాతకా♦నట్టివాఁడు.

శ్లో. కిమహర్నిశమనుచింత్యం?
కేశవచరణాంబుజనేషుచంచలతా;
కాచసభాపరిహార్యా?
హీనాయావృద్ధసచివేన;

గీ. ఏయది విచింత్యమైయుండు♦నేయుఁ బవలు
హరిచరణభక్తి జనులయం♦దస్థిరతయు;
ఏసభ పరిహరింపనౌ♦ నెట్టిసభను
వృద్ధసచివుండు లేకుండ♦నెసఁగునద్ది.

శ్లో. బ్రూహిస్ఫురతిచకావా?
స్వభ్యస్తానిర్మలావిద్యా;
ప్రాణాదపికోరక్ష్యః?
కులధర్మ, స్సాధుసంగశ్చ;

గీ. ఏది సమాజంబునకు స్ఫురి♦యించుఁ జెపుమ?
గురుజనాభ్యస్త, నిర్మల♦పరమవిద్య;
ప్రాణములకన్న నెయ్యది♦రక్ష్యమగును?
స్వకులధర్మంబు, సజ్జన♦సంగమంబు.

శ్లో. కఃపంగురిహప్రథితో?
ప్రజతిచయోవార్థకే తీర్థం;
కింతీర్థమపిచముఖ్యం?
చిత్తమలంయన్నివర్తయతి;

గీ. క్షితినెవండు పంగుఁడనఁ బ్ర♦సిద్ధిఁ జెందు?
తీర్థములకేగు నాతఁడు♦వార్థకమున;
నేదిముఖ్యమౌతీర్థంబు?♦హృదయమలిన
మెద్దియెడబాపునో యది♦యేతలంప;

శ్లో. కింస్మర్తవ్యం పురుషైః?
హరిపాదయుగంనయూవనీభాషా
కోహినవాచ్యస్సుధియా?
పరదోషశ్చానృతంతద్వత్.

గీ. నిఖిలపురుషులకును స్మర♦ణీయమెద్ది?
హరిపదమె, కాని కాదల♦యవనభాష;
పండితుండైనవాఁడెది♦పలుకఁదగదు?
పరులదోషమ్ములై యసత్య♦వాక్యమొకటి.

శ్లో. కిం సంపాద్యం మనుజైః?
ర్విద్యావిత్తం, బలం, యశః, పుణ్యం;
కస్సర్వగుణవినాశీ?
లోభః; శ్శత్రుశ్చకః? కామః;

గీ. ప్రజలు వేనినినార్జింప♦వలయుమహిని?
విత్తము, యశంబు, పుణ్యంబు♦విద్య, బలము;
నెల్లగుణముల నణఁగించు♦నేది? లోభ:
మేదిశత్రుతుల్యము? కామ♦మేతలంప;

శ్లో. ఇహాకుత్రావహిం తస్స్యాన్మనుజః?
కిలరాజసేవాయాం;
కాసంరక్ష్యా?
కీర్తిః పతివ్రతానైజబుద్ధిశ్చ;

గీ. ఉర్వినెట జాగరూకుఁడై♦యుండవలయు
మనుజుఁ? డారయ రాజసే♦వనమునందు;
రక్షణీయమెయ్యది? పతి♦వ్రతయుఁగీర్తి
యమలవకా నైజబుద్ధియు♦ననెడిమూఁడు.

శ్లో. కాకల్పలతాలోకే?
సచ్ఛిష్యాయార్పితావిద్యా;
కోఽక్షయవటవృక్షస్స్యా?
ద్విధివత్సత్పాత్రదత్తదానంయత్.

గీ. జగతిలో నెద్ది కల్పకు♦జమ్ముఁబోలు?
మంచిశిష్యులకునుసమ♦ర్పించువిద్య;
ఏదితలఁప నసేయునటు♦వృథమహా? య
ధావిధని సౌభాగ్యసకోసంగు♦దానమొకటె;

శ్లో. కింశస్త్రిం సర్వేషామ్?
యుక్తిః; ర్మాత్రాంచకాః ధేనుః;
కిన్ను బలం? యద్ధైర్యం;
కోమృత్యుః? ర్యదవధానరహితత్వం;

గీ. ఏదిశస్త్రతుల్యము ప్రజ♦కెల్ల? యుక్తి;
మాతఁబోలెడు నెయ్యది?♦మంచియావు;
ఎయ్యది బలంబు? ధైరంబు;♦మృత్యువేది?
యరయ నవధాన రహితత్వ♦మానఁగాదె;

శ్లో. కుత్రవిషం? దుష్టజనే;
కిమిహాశౌచంభవేద్రుణంనృణాం;
కిమభయమిహ?
వైరాగ్యం; భయమపికిం?విత్తమేవసర్వేషాం;

గీ. ఎందువిషముండు? దుష్టుల♦యందు; జగతి
జనులకెయ్యదశౌచంబు?♦ఋణము; భయము
లేనిదెయ్యది? వైరాగ్య♦మాను; సర్వ
జనులకును భయావహమేది?♦ధనమొకండె;

శ్లో. కాదుర్లభానరాణాం?
హరిభక్తిః; పాతకంచకిం? హింసా;
కోహిభగవత్ప్రియస్స్యాత్?
యోఽన్యంనోద్వేజయేదనుద్విగ్నః;

గీ. నరుల కెయ్యది లభ్యంబు? హరిసుభక్తి;
ఏదిపాతకమగు? హింస; యెవ్వఁడు భగ
వత్ప్రియుండగు? నొరులకు భయము నొసంగ
కొరులచే భయంపడకుండ నుండునతఁడు;

శ్లో. కస్మాత్సిద్ధిః? స్తపసః;
బుద్ధిః క్వను? భూసురే; కుతో బుద్ధిః?
వృద్ధోపసేవయా; కేవృద్ధాః?
యేధర్మతత్వజ్ఞాః;

గీ. ధరణి దేనివలన సిద్ధి? తపమువలన;
నెవరియందుండు బుద్ధి? మహీసురాళి
యందు; నెట్లగుబుద్ధి? వృద్ధాతిసేవ;
వృద్ధులెవ్వరు? ధర్మజ్ఞులే తలంప;

శ్లో. సంభావితస్యమరణాదధికంకిం?
దుర్యశోభవతి;
లోకేసుఖీభవేత్కో?
ధనవాన్; ధనమపిచకిం? యతశ్చేష్టమ్;

గీ. మరణమునకన్న నెయ్యది♦మానితునకు
నధికమౌ? నపకీర్తి; సు♦ఖాఢ్యుఁడెవఁడు
ధరణిలో? ధనవంతుండు;♦ధనమదేది?
యిష్టసిద్ధియొసంగెడి♦దెదియొయదియె;

శ్లో. సర్వసుఖానాం బీజంకిం?
పుణ్యం; దుఃఖమపికుతః? పాపాత్;
కస్యైశ్వర్యం? యః కిలశంక
రమారాధయేద్భక్త్యా;

గీ. ఎల్లసుఖములకును బీజ♦మేది? పుణ్య
మగును; దుఃఖంబు దేనిచే?♦నఘముచేత;
నెవని కనుపమానైశ్వర్య?♦మిద్ధభక్తి
పూర్ణముగఁజేయు శంకర♦పూజకునకు;

శ్లో. కోవర్ధతే? వినీతః;
కోవాహీయేత? యోదృప్తః;
కోనప్రత్యేతవ్యో
బ్రూతేయశ్చానృతంశశ్వత్;

గీ. వృద్ధిఁబొందుచునున్నవాఁ♦డెవఁడు? నమ్రుఁ;
డెవఁడు హీనుండు? గర్వితుం;♦డెవఁడు నమ్మఁ
దగని యాతఁడు? పల్కుచు♦దబ్బరలను
బలుకుచుండెడు నాతఁడే♦యిలఁదలంప;

శ్లో. కుత్రానృతేప్యపాపం?
యచ్చోక్తం ధర్మరక్షార్థమ్;
కోధర్మోఽభిమతో?
యశ్శిష్టానాం నిజకులీనానామ్;

గీ. అనృతమువచించినను బాప♦మబ్బ దెందు?
ధర్మరక్షణకొఱకై న♦దబ్బ రందు;
ధర్మమెయ్యది? నిజకుల♦కర్మనిష్ఠ
నలరు శిష్టులకు హితంబు♦నైనయదియ.

శ్లో. సాధుబలంకిం? దైవం;
కస్సాధుః? స్సర్వధాతుష్టః
దైవంకిం? యత్సుకృతం;
కస్సుకృతీ? శ్లాఘ్యతేచయస్సద్భిః

గీ. బలము సుజనులకేది? దై♦వంబు; సుజనుఁ
డెవ్వఁడు? నిరతంబుఁ బరితుష్టి♦నెసఁగువాఁడు;
దైవమెయ్యదియగు? సుకృ♦తమ్ము; పుణ్యుఁ
డెవ్వఁడు? సజ్జనసమ్మాన్యుఁ♦డే తలంప;

శ్లో. గృహమేధినశ్చమిత్రంకిం?
భార్యా; కోగృహీచ? యోయజతే;
కోయజ్ఞో? యచ్ఛ్రుత్యా విహితః
శ్రేయస్కరోనృణాం;

గీ. హితుఁ డెవండు గృహస్థున? ♦ కతిథియగు; గృ
హస్థుఁ డెవ్వఁడు? యజ్వయగు; ♦ యజన మేది?
యఖిలజనులకు హితము న ♦ ఖిలసుకృతక
రమ్ములగు వేదవిహితక ♦ ర్మములు సుమ్ము.

శ్లో. కస్యక్రియాహి సఫలా
యః పునరాచారవాన్ శిష్టః;
కశ్శిష్టో? యో వేదప్రమాణవాన్
కో హతః? క్రియాభ్రష్టః;

గీ. సఫలమానేని కార్య? మా ♦ చారనిష్ఠఁ
జెలఁగు శిష్టుని; దెవ్వఁడు ♦ శిష్టుఁడగును?
వేదమే ప్రమాణంబుగా ♦ నెలయునతఁడు;
వసుధ హతుఁ డెవ్వఁ డగుఁ గ్రియా ♦ భ్రష్టజనుఁడు.

శ్లో. కో ధన్యః? సన్న్యాసీ;
కో మాన్యః? పండితస్సాధుః;
కస్సేవ్యో? యో దాతా;
కో దాతా? యోఽర్థితృప్తిమాతనుతే;

గీ. ధన్యుఁ డెవ్వఁడు? సన్న్యాసి; ♦ మాన్యుఁ డెవఁడు?
సాధువగు పండితుఁడు; సేవ ♦ సలుపుచుండఁ
దగినవాఁ డెవ్వఁడగు? దాత; ♦ దాత యెవఁడు?
సకలయాచక సంతృప్తి ♦ సలుపునతఁడు;

శ్లో. కింభాగ్యం దేహవతాం?
మారోగ్యం; కః ఫలీ? కృషికృత్;
కస్యనపాపం? జపతః;
కః పూర్ణో? యః ప్రజావాంత్స్యాత్;

గీ. భాగ్యమేది దేహులకు? నారోగ్య; మెవఁడు
ఫలముఁగొనువాఁడు? కృషిసల్పువాఁ; డెవండు
పాపరహితుండు? విష్ణుజపంబుసల్పు
వాఁడు; పూర్ణుండెవఁడుపుత్రవంతుఁ డరయ;

శ్లో. కిందుష్కరంనరాణాం?
యన్మనసోనిగ్రహస్సతతమ్;
కోబ్రహ్మచర్యవాంత్స్యా?
యశ్చాస్ఖలితోర్ధ్వరేతస్కః;

గీ. నరులకెల్లను దుష్కరంబరయనేది?
యతులమైన మనోనిగ్రహంబుతలఁప;
బ్రహ్మచర్యంబునందినవాఁడెవండు?
ధరణినస్ఖలితోర్ధ్వరేతస్కుఁడరయ;

శ్లో. కాచపరదేవతోక్తా?
చిచ్ఛక్తిః; కోజగద్భర్తా?
సూర్యః; సర్వేషాంకో
జీవనహేతుః? సపర్జన్యః;

గీ. జగతినెది పరదేవత?♦జ్ఞానశక్తి;
ధరణిభరియించు నెవ్వాఁడు?♦తరణి;యెల్ల
వారలకెపుడు జీవన♦కారణంబు?
ప్రబల సంతోషమొసఁగుప♦ర్జన్యుఁ డొకఁడు.

శ్లో. కశ్శూరో? యోభీతత్రాతా;
త్రాతాచకః? సగురుః
కోహిజగద్గురురుక్తః? శ్శంభుః;
జ్ఞానంకుతః? శ్శివాదేవ;

గీ. ధరణిశూరుఁడెవఁడు? భయ♦త్రాత; త్రాత
యెవఁడు?గురువు;జగద్గురుం♦డెవఁడు? శివుఁడు
సకల సన్మార్గదర్శియౌ♦జ్ఞానమెవని
చేఁగలుగు? జగద్గురుఁడైన♦శివునివలన;

శ్లో. ముక్తింలభేతకస్మా?
న్ముకుందభక్తే; ర్ముకుందఃకః?
యస్తారయేదవిద్యాం;
కాచావిద్యా? యదాత్మనోఽస్ఫూర్తిః;

గీ. ముక్తియెద్దానిచే? హరి♦భక్తిచేత;
హరియెవఁ? డవిద్యఁ దొలఁగించు♦నట్టివాఁ;డ
విద్యయన నేమి? యత్త్వవి♦వేకసరణి
సొరిదిఁదగు నాత్మవిజ్ఞాన♦శూన్యబుద్ధి;

శ్లో. కస్యనశోకో? యస్స్యాదక్రోధః?
కిం సుఖం? తుష్టిః;
కోరాజా? రంజనకృ;
త్కశ్చశ్వా? నీచసేవకోయస్స్యాత్,

గీ. ఎవ్వఁడెఱుఁగఁడు దుఃఖంబు?♦నెవఁడుకోప
మెఱుఁగఁడో వాఁడు; సుఖమెందు?♦దృప్తి; నెవఁడు
క్షితిపుఁడారయఁ? బ్రజలరం♦జించునతఁడు;
శ్వాన మెవ్వఁ? డలతిసేవ♦సలుపు నతఁడు;

శ్లో. కోమాయీ? పరమేశః
క ఇంద్రజాలాయతే? ప్రపంచోఽయమ్;
కః స్వప్ననిభో? జాగ్రద్వ్యవహారః;
సత్యమపిచకిం? బ్రహ్మ;

గీ. ఎవ్వఁడు సమాయకుఁడు? పర♦మేశుఁ; డేది
యింద్రజాలసమానమౌ?♦నీజగంబు;
స్వప్నమేది? జాగ్రత్తలో♦సల్పునదియు;
పరిధితసత్యమెయ్యది? పర♦బ్రహ్మమొకటి;

శ్లో. కింమిథ్యా? యద్విద్యానాశ్యం;
తుచ్ఛంతు? శశవిషాణాది;
కాచానిర్వచనీయా? మాయా;
కిం కల్పితం? ద్వైతమ్;

గీ. ఏదిమిథ్య? విద్యనుఁశి♦యించునదియు;
యేదితుచ్ఛంబు? శశవిషా♦ణాదికంబు;
ఏదియనిర్వచనీయ మా♦నెన్న? మాయ;
ధరణిఁగల్పిత మేది? ద్వై♦తంబుతలఁప;

శ్లో. కిం పారమార్థికంస్యా? దద్వైతం;
చాజ్ఞతా కుతోఽనాదిః;
వపుషశ్చపోషకం కిం? ప్రారబ్ధం;
చాన్నదాయికిం? చాయుః;

గీ. పారమార్థిక మేది? య♦ద్వైత;మెందు
నుదయమందెను? సజ్ఞాన?♦మదియనాది;
రహినిదనువోషమునేది? ప్రా♦రబ్ధకర్మ;
మన్నదాయక మెయ్యది?♦యాయువొకటి.

శ్లో. కో బ్రాహ్మణై రుపాస్యో?
గాయత్ర్యర్కాగ్నిగోచరశ్శంభుః;
గాయత్ర్యా, మాదిత్యే, చాగ్నౌ
శంభౌ చకిన్ను? తత్తత్త్వమ్;

గీ. బ్రాహ్మణోపాస్యదైవమె♦వ్వఁడగు? నగ్ని
సవితృగాయత్రులం దోఁచు♦శంకరుండు;
వెలఁగ నర్కాగ్నిగాయత్రి♦శివులయందుఁ
దనరుచుండెడి దెయ్యది?♦తత్త్వమదియ;

శ్లో. ప్రత్యక్షదేవతాకా? మాతా;
పూజ్యోగురుశ్చకః? తాతః;
కస్సర్వదేవతాత్మా?
విద్యాకర్మాన్వితోవిప్రః;

గీ. ఇలను బ్రత్యక్షదైవతంబేది? తల్లి;
ఎవఁడుపూజ్యుండుగురుఁడునై యొసఁగుఁ? దండ్రి;
మహితుఁడౌ సర్వదేవతాత్మకుఁడెవండు?
జ్ఞానసత్కర్మ సంసిద్ధిఁగన్న ద్విజుఁడు.

శ్లో. కశ్చకులక్షయహేతుః
స్సంతాపస్సజ్జనేషుయోకారి;
కేషామమోఘవచనం?
యేచపునస్సత్యమౌనశమశీలాః.

గీ. కనఁగనెవఁడు కులక్షయకారణంబు?
సకలసజ్జనసంతాపసంజనకుఁడు;
ఎవనివచన మమోఘ? మహీనసత్య
మౌన, శమ, శీలములు గల్గువానిమాట.

శ్లో. కిం జన్మ? విషయసంగః;
కిముత్తరంజన్మ? పుత్రస్స్యాత్;
కోపరిహార్యో? మృత్యుః;
కుత్రపదం విన్యసేచ్చ? దృక్పూతే;

గీ. జన్మమెయ్యది? విషయసం♦సర్గమరయ;
నేదియుత్తరజన్మమా♦త్మోదయంబు;
ఏది యపరిహార్యము? మృత్యు;♦వెచటనిడఁగ
నౌనుబదముల దృక్పూత♦మైన-చోట;

శ్లో. పాత్రం కిమన్నదానే? క్షుధితం;
కోర్చ్యోహి? భగవదవతారః;
కశ్చభగవాన్? మహేశశ్శంకర
నారాయణాత్మైకః;

గీ. అన్నదానంబునకుఁబాత్రుఁ♦డగునెవండు?
క్షుధితుఁ; డర్చనీయుఁడెవండు?♦ప్రథితుఁడీశ్వ
రావతారుండు, భగవంతుఁ♦డననెవండు?
హరిహరాత్మకుఁడగు మహే♦శ్వరుఁడొకండె;

శ్లో. ఫలమపి భగవద్భక్తేః కిం?
తల్లోకస్వరూపసాక్షాత్వం;
మోక్షశ్చకో? హ్యవిద్యా
స్తమయః; కస్సర్వవేదభూరథ? చోమ్.

గీ. ధరణి హరిభక్తిఫలమేది?♦తత్పదాప్తి,
తత్స్వరూప సాక్షాత్కార♦తయును; మోక్ష
మరయనేది? యవిద్యాక్షయ;♦మణఁగునుండు
గలుగువేదంబు లెందు? నోం♦కారమందు;

శ్లో. ఇత్యేషా కంఠస్థా; ప్రశ్నోత్తర
రత్నమాలికాయేషామ్
తేముక్తాభరణాఇవ, విమలాశ్చ
భాన్తి సత్సమాజేషు.

గీ. రహితలిప్సఁ బ్రశ్నోత్త రరత్నమాల
కంఠమునఁగల్గియున్న ముక్తాభరణవి
లాసుఁడై స్వచ్ఛతముఁడౌచు భాసమానుఁ
డౌ నుభయలోక సత్సభాభ్యంతరముల.

గీ. సకల సుజన సంస్తవనప్రశస్తధర్మ
రంజితమగు ప్రశ్నోత్తరరత్నమాలఁ
దేఁట తెనుఁగున నిట్టులాంధ్రీకరించె
జగతి వెలయ సుబ్రహ్మణ్యశాస్త్రిసుకవి.

సమాప్తము.



# వెలకు సిద్ధము.

| | |
|---|---|
| 1. సంగీతకృతిదర్పణము | రు 2- 0-0 |

**నాటకములు.**

| | |
|---|---|
| 2. రోహిణీసుధాకరవిజయము | 0-12-0 |
| 3. సుభద్రార్జునీయము | 0-12-0 |
| 4. ప్రభావతీప్రద్యుమ్నము | 0-12-0 |
| 5. ద్రౌపదీస్వయంవరము | 0- 8-0 |
| 6. యామినీపూర్ణతిలక | 0- 8-0 |
| 7. ధర్మార్థసిద్ధి | 0-10-0 |
| 8. రాధారాణి | 0- 8-0 |

**ప్రబంధములు.**

| | |
|---|---|
| 9. మల్లికావసంతము | 1- 0-0 |
| 10. రామదయాసారము | 1- 0-0 |
| 11. దమయంతీస్వయంవరము | 0- 2-0 |
| 12. కేశవశతకము | 0- 2-0 |
| 13. ప్రశ్నోత్తరరత్నమాల | 0- 4-0 |

వలయువారికి గ్రంథములయొక్కయు షాపు సామానులయొక్కయు పూర్తియైన మా కేటలాగు పంపుచున్నారము.

పి. సుబ్బారావు అండ్ సన్సు,
కాకినాడ.